# జ్ఞానపదములు
# జానపదములు

దేవులపల్లి రామానుజరావు

# జ్ఞానపదులు - జానపదులు

(వ్యాసాల సంకలనం)

రచన

దేవులపల్లి రామానుజరావు

ప్రచురణ

రిజిస్టర్డ్ నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

GNANAPADULU - JANAPADULU

(A Collection of Essays & Radio Talks)

By

DEVULAPALLI RAMANUJA RAO.

---



ప్రచురణ : 114

ప్రథమ ముద్రణ : 5 అక్టోబర్ 1985

ప్రతులు : 1200

ముఖచిత్రాలంకృతి : శీలా వీర్రాజు

వెల : Rs 10-00

ముద్రణ :
చార్మినార్ ఆర్ట్ ప్రింటర్స్,
గంజ్ బజార్, సికింద్రాబాదు - 500 003.

ప్రతులకు :

యువభారతి
5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 500003 లేదా
యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్డు, హైదరాబాదు - 500001

# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభాపరిమళాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మకశక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సామరస్యం, శివంకరమైన భావం, సత్యగవేషణాదృక్పథం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. నిర్మాణాత్మక శక్తులకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన ఇరువది రెండేళ్లుగా, సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు ఉత్తమసాహిత్యంకంటే సాత్త్వికమైన సాధనం లేదనే విశ్వాసంతో యథోచిత కార్యక్రమాలను రూపొందించి, నిర్వహిస్తూ కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు ప్రజా బాహుళ్యానికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల, దేశంపట్ల అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణోద్యమాన్ని చేపట్టింది. ఇంతవరకు 114 పుస్తకాలను ప్రచురించి నాలుగు లక్షల ప్రతులను తెలుగు పాఠకులకు అందించగలిగింది.

యువభారతి సంస్థ భవిష్యన్నిర్మాణ కార్యక్రమాలకు సహకరించేందుకు రూపొందిన శాశ్వత జీవిత పథకాలలో ఇప్పటికి 1398 మంది సహృదయులు 'భారతీ మిత్రు'లుగా, 135 మంది సహృదయులు 'భారతీ భూషణు'లుగా చేరి మాకు తోడ్పడుతున్నారు.

ఉదాత్తభక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచింది ప్రజలు. వారి సౌహార్దం, భాషాభిమానం – ఇవే మా పెట్టుబడి మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయన శీలత, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాము.

సహృదయుల సహకారాన్ని అర్థిస్తూ—

హైదరాబాదు
5-10-1985

**ఇరివెంటి కృష్ణమూర్తి**
అధ్యక్షుడు

# మా మాట

తమ అమేయప్రతిభతో, అప్రతిమాన సామర్థ్యంతో, నిశ్చల నిరంతర తపోనిరతితో భారతీయుల జీవితాలను శక్తిమంతం చేసిన నిన్నటితరం మనీషులు ధన్యజీవులు. వారి జీవన విధానంతో, వారి సందేశంతో ప్రభావితులై తమ వ్యక్తిత్వాన్ని మలచుకున్న చరితార్థులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు. తెలుగు భాషా సంస్కృతులపై కత్తిగట్టిన నిజాం నిరంకుశ పాలనకు ఎదురొడ్డినిలిచి తెలంగాణ మాగాణంలో తెలుగుబాస పసిడిపంటలు పండించిన రచయితలు ఆయన. సంస్కృతాంధ్రాలను ఒక పద్ధతి ప్రకారం అధ్యయనం చేయకపోయినా, నిరంతరగ్రంథపఠనంవల్ల, సాహితీ తపస్సంపన్నుల సాహచర్యంవల్ల ఆయన సహృదయవిమర్శకులుగా, ఉత్తమ అధ్యయన శీలురుగా రూపొందినారు. న్యాయశాస్త్రంలో పట్టా సంపాదించినా, న్యాయవాది వృత్తిని చేపట్టక, ప్రభుత్వ ఉద్యోగం తలపెట్టక, ఎక్కడా ఊడిగం చేయక స్వాభిమానంతో జీవయాత్ర సాగించిన సత్త్వ సంపన్నులు ఆయన. సాహిత్య సాంస్కృతిక సంస్థలనిర్వహణలో కొత్తబాటలు వేసి పరస్పర వైరుధ్యాలున్న రచయితలతో, కళాకారులతో కలసికట్టుగా పనిచేసి లక్ష్యాలను సాధించవచ్చునని నిరూపించగలిగిన ప్రతిభాశాలురు, ఆదర్శమూర్తులు శ్రీ రామానుజరావు. ఆంధ్ర సారస్వత పరిషత్తు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, గోలకొండ పత్రిక, శోభ సాహిత్య మాసపత్రిక ఆయన నిర్వహణ దక్షతకూ నిస్స్వార్థ సేవాపరాయణతకూ, ప్రతీకలుగా నిలిచిపోయినవి. తెలంగాణా వైతాళికులలో ఒకరు ఆయన. ఆయన ఒక తెలుగు వెలుగు.

మా 'యువభారతి'కి శ్రీ రామానుజరావుగారు పెద్దదిక్కు. మేము నిర్వహిస్తున్న సాహిత్యోద్యమానికి బాసటగా నిల్చి ప్రోత్సాహాన్ని అందిస్తున్న సుహృన్మణులు.

"జ్ఞానపదులు - జానపదులు" అన్న ఈ గ్రంథాన్ని ప్రచురించుకునే అవకాశాన్ని మాకు కల్పించి తమ ఔదార్యాన్ని ప్రకటించుకున్నారు.

# రచయిత శుభాకాంక్షలు

నేను అప్పుడప్పుడు రేడియోలో చేసిన ప్రసంగాలను, పత్రికలకు, ప్రత్యేక సంచికలకు వ్రాసిన వ్యాసాలను ఒక పద్ధతి ప్రకారం ఏర్చి కూర్చి కొన్ని సంపుటాలుగా ప్రచురించాలని అనుకున్నాను.

ఆ వరుసలో ఇది మొదటి సంపుటం.

భారతీయుల ప్రతిభాపాండిత్యాలకు, సంస్కృతికి ప్రాతినిధ్యం వహిస్తున్న కొందరు మనీషులనుగూర్చి నేను చేసిన ప్రసంగాలను, తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన కొందరు ప్రతిభా మూర్తులనుగూర్చి నేను చేసిన ప్రసంగాలను, వ్రాసిన వ్యాసాలను, విశ్వవిఖ్యాత ఇంగ్లీషు రచయిత జార్జి బెర్నార్డ్ షాను గూర్చి వ్రాసిన వ్యాసాన్ని, జానపదుల కళామయ జీవితాన్ని పరిచయం చేస్తున్న కొన్ని ప్రసంగాలను ఈ "జ్ఞానపదులు - జానపదులు" అన్న పుస్తకంగా మలచి అందిస్తున్నాను.

జీవితంలోనూ, సాహిత్యంలోనూ పాతకొత్తల మేలికలయికవల్ల సర్వతోముఖ వికాసం కలుగడానికి వీలున్నదని నమ్ముతూ, ఉత్తమ సాహిత్య ప్రసరణానికి కృషిచేస్తున్న సంస్థ 'యువభారతి' ఈ సంపుటాన్ని ప్రచురించ డానికి పూనుకున్నది.

నాకు 'యువభారతి' సభ్యులతోనూ, కార్యకలాపాలతోనూ చాలా కాలంనుంచి సాన్నిహిత్యం ఉన్నది. ఈ సాన్నిహిత్యాన్ని పురస్కరించుకుని ఈ ప్రచురణకోసం నన్ను అభ్యర్థించినారు. చాలా సంతోషంతో నేను అంగీక రించినాను.

నిర్మాణాత్మక దృక్పథంతో కార్యక్రమాలు నిర్వహిస్తున్న యువ భారతికి నా అభినందనలు, శుభాకాంక్షలు.

హైదరాబాదు
ఆగస్టు 15, 1985.

దేవులపల్లి రామానుజరావు

ఆయనకు ఔపచారికంగా కృతజ్ఞతలు తెలుపడం కంటే భక్తిపూర్వకంగా అభివందనాలను సమర్పించడంలోనే ఔచిత్యం ఉంటుంది. శ్రీ రామానుజ రావుగారి సాహితీ తపస్సు ఇతోధికంగా కొనసాగుతూ ఉండాలనీ, ఆయనకు ఆయురారోగ్యాలను పరాత్పరుడు ప్రసాదిస్తూ ఉండాలని ఆకాంక్షిస్తున్నాము. శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి 'యువభారతి' నమోవాకములను సమర్పించుకుంటున్నది.

హైదరాబాదు
5-10-85.

**ఇరివెంటి కృష్ణమూర్తి**
అధ్యక్షుడు

# విషయానుక్రమణిక

## జ్ఞానపదులు



## జానపదులు

# గురుదేవుడు రవీంద్రుడు

ఆగస్టు 15 సకలభారతదేశమునకు పండుగ; ఈ రోజు మన దేశము నూట యేబది సంవత్సరాల ఆంగ్ల పరిపాలన నుండి విముక్తి నొందెను. ఈ శుభ సందర్భమున మనము సంస్మరించవలసిన మహనీయులలో గురుదేవుడు రవీంద్రుడు ముఖ్యుడు. భారత జాతీయ గీతమును రచించిన మహాకవి ఆయన, అందుచేత స్వాతంత్ర్యోత్సవ సందర్భమున ఆయనను స్మరించుటలో విశిష్టత కలదు. ఆయన పరమపదించినది ఆగస్టు మొదట వారము. ఇందుచేత కూడ ఆగస్టు నెలలో ఆయన స్మరణకు ప్రత్యేకత గలదు.

రవీంద్రుడు సాహితీ ప్రపంచమున, ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన గొప్ప రచయిత. అంతమాత్రమే కాదు ఆయన మన దేశ సమస్యలయందు ప్రత్యేక శ్రద్ధను తీసికొనిన త్యాగమూర్తి. ఇల్లు గాలిపోవునపుడు వీణను చేతబట్టుకొను ప్రబుద్ధుడు రవీంద్రుడు కాడు. మన దేశనాయకులనేకులకు పూజ్యుడు రవీంద్రుడు. జాతిపితయైన గాంధీ మహాత్ముడు ఆయనను గురుదేవుడని సంబోధించెడివాడు. మహాత్ముని పూర్ణపురుషునిగా గురుదేవుడు సంభావించెడివాడు.

మన దేశ రాజకీయ సమస్యలనుగూర్చి రవీంద్రుడు సర్వదా ఆలోచించెడివాడు. 1919 సంవత్సరమునకు ముందు ఇంగ్లీషు వారు ఆయనకు సర్ బిరుదమునిచ్చియుండిరి. ఆనాడు మన దేశములో గొప్పవారికి చాలమందికి ఇటువంటి బిరుదులు ఇంగ్లీషు ప్రభుత్వము ఇచ్చియుండెను. 1919 సంవత్సరములో అమృతసర్ పట్టణమున బ్రిటిషు ప్రభుత్వము జనసమూహము పైన తుపాకులను గాల్చినపుడు అందుకు నిరసనగా రవీంద్రుడు తన సర్ బిరుదమును త్యజించెను. ఆనాడు మన దేశమున సర్ బిరుదాంకితులైన గొప్పవారు మరి కొందరు ఉండిరి. కాని ఇట్టి త్యాగమును, ధైర్యమును, సాహసమును ప్రదర్శించినవాడు రవీంద్రుడే. ఆనాడు రవీంద్రుడు ఇండియా వైస్రాయికి వ్రాసిన లేఖ ప్రపంచ లేఖాసాహిత్యములో మహోజ్జ్వలమైనది. జపాను దేశపు సామ్రాజ్యతత్వమును నిరసించుచు జపాను కవీంద్రునికి రవీంద్రుడు వ్రాసిన

యు త్తరము మరొక మహోజ్జ్వలమైన లేఖ. బహుళః 1940 వ సంవత్సరమున కాబోలు భారత జాతీయ నాయకులను బ్రిటిషు ప్రభుత్వము చెరసాలలో నుంచినపుడు మిస్. రాత్ బోన్ అను పాశ్చాత్య యువతి భారత నాయకులను దూషించుచు ఒక ప్రకటనచేసి యుండెను. ఆ ప్రకటనకు రవీంద్రుడిచ్చిన సమాధానము ఆయనకు మన స్వాతంత్ర్యోద్యమము నందుగల గాఢమైన సానుభూతిని జాతీయ నాయకులందుగల అపార గౌరవమును వెల్లడి చేయుచున్నది.

రవీంద్రుడు గాంధీ మహాత్ముడు పరస్పరము పూజ్యభావము కలిగి యుండిరి. వారికి ఒకసారి మాత్రమే అభిప్రాయభేదము కలిగినది. విదేశ వస్తు బహిష్కరణమును చేయవలెనని గాంధీ మహాత్ముడు ప్రబోధించి స్వదేశీ ఉద్యమ ప్రచారము గావించినపుడు రవీంద్రుడు ఈ ఉద్యమము ఉపయోగమును, యోగ్యతను సందేహించుచు గాంధీ మహాత్మునికి ఒక ఉత్తరము వ్రాసెను. దానిని ఉత్తరమనుటకన్న సాహిత్య ఖండమని చెప్పుట సమంజసము. దీనికి సమాధానముగా గాంధీ మహాత్ముడు వ్రాసిన ప్రత్యుత్తరము భావగాంభీర్యము నందును, భాషాసౌందర్యము నందును రవీంద్రుని రచనకు ఏ మాత్రము తీసిపోని రమణీయమైన ఖండ కావ్యమని చెప్పవచ్చును. రవీంద్రుడు రాజకీయ నాయకుడుగా, గాంధి ఒక మహాకవిగా ఈ ఉత్తర ప్రత్యుత్తరాలలో ప్రత్యక్షమగుచున్నారు. ఇదియే వారి ప్రణయ కలహములలో మొదటిది. మరియు చివరిది; తరువాత వారికి అభిప్రాయ భేదాలెన్నడును కలుగలేదు. గాంధీ మహాత్ముని ఇష్టమునకు వ్యతిరేకముగా సుభాష్ చంద్రబోసు కాంగ్రెస్ అధ్యక్ష పదవికి పోటీచేసినపుడు కొందరు సుభాష్ చంద్రబోసు పక్షము వహించవలసినదని రవీంద్రుని కోరిరి. కాని ఆయన అందుకు సమ్మతించలేదు. మహాత్మునికి వ్యతిరేకముగా ఆయన ముందుకు రాలేదు.

జవహర్ లాల్ నెహ్రూ యందు రవీంద్రుడు, ప్రేమ, అభిమానము, వాత్సల్యము కలిగియుండెను. జవహర్ లాల్ నెహ్రూకు మొదటి నుండియు రవీంద్రుని యందు భక్తి. రవీంద్రుని ఉన్నతాదర్శములచేత జవాహర్ లాల్ ప్రభావితుడైన నిదర్శనాలు కలవు. భారత జాతీయ కాంగ్రెస్ యొక్కయు, భారతదేశ స్వాతంత్ర్యము యొక్కయు విదేశాంగ విధానము రూపొందజేసిన రాజకీయవేత్త జవాహర్. జవాహర్ విదేశాంగ విధానము మీద రవీంద్రుని ఉన్నతాదర్శాల ప్రభావము కనపడుచున్నది రవీంద్రుడు జాతివిచక్షణా

విధానమునకు వ్యతిరేకి. సామ్రాజ్య తత్త్వమునకు ప్రతికూలుడు. మానవత్వము నందు విశ్వాసము కలిగిన మహనీయుడు. యుద్ధాలను ఆయుధాలను ప్రతిఘటించిన శాంతిప్రియుడు. జగత్కల్యాణమునకై పరితపించిన ఋషీశ్వరుడు. రవీంద్రుడు ప్రపంచమునకు ప్రేమ సందేశము నిచ్చిన మహానుభావుడు. ఒక జాతి మరొక జాతి మీద అధికారము వహించు జాతీయాహంకారమును, ఒక మానవుడు మరొక మానవుని బానిసగా జూచు మనస్తత్వమును రవీంద్రుడు సర్వదా వ్యతిరేకించి యుండెను. జవాహర్‌లాల్ దివ్యవాణివలె, రవీంద్రుని దివ్యవాణి సకల ప్రపంచమునకు, శాంతి సందేశము నిచ్చునదిగా నుండెను. తన అభిప్రాయాలను రవీంద్రుడు ఉపన్యాసము లందును, రచనల యందును పలుమారు ప్రకటించి యుండెను. స్వతంత్ర భారతదేశము ఆదర్శములు కూడ ఇట్లే ఉండవలెనని ఆయన కలలు గనుచుండెను. రవీంద్రుని ఆదర్శాలు, స్వప్నాలు జవాహర్‌లాల్ నెహ్రూ విదేశాంగ విధానములో ప్రతిబింబితమైనవి ఇది రవీంద్రుని విశిష్టత. కావుననే రవీంద్రుడు సకల భారత నాయకులకు గురుదేవుడైనాడు.

ఆధునిక కాలములో భారతదేశ ఆత్మకు చిహ్నములని చెప్పదగినవారు ముగ్గురు. ఒకరు గాంధీ మహాత్ముడు. రెండవవారు రవీంద్రుడు. మూడవవారు జవాహర్‌లాల్ నెహ్రూ. గాంధీ మహాత్ముడు సత్యమునకు ప్రతినిధి. రవీంద్రుడు సౌందర్యమునకు ప్రతినిధి. జవాహర్‌లాల్ శివమునకు అనగా మంగళమునకు, శాంతికి ప్రతినిధి. సత్యము. సౌందర్యము. శివము భారతదేశ సంస్కృతికి మూలకందములు. భారతదేశము ఆత్మకు చిహ్నములు. వీనికి ప్రతినిధులైన యీ ముగ్గురు మహనీయుల వ్యక్తిత్వాల సమన్వయమే భారతదేశ ఆత్మ.

రవీంద్రుడు పరమపదించినప్పుడు, ఆయనకు శ్రద్ధాంజలి సమర్పించుచు రవీంద్రుని రచనలకు అమూల్యమైన వ్యాఖ్యానము వ్రాసి, పాశ్చాత్య ప్రపంచమునకు పరిచయము చేసిన డాక్టర్ రాధాకృష్ణన్ "రవీంద్రుడు వ్యాస, వాల్మీకుల పరగతికి చెందినవాడని" చెప్పిరి. నిజమే! వ్యాస వాల్మీకులవలె రవీంద్రుడు మహర్షియైన కవీంద్రుడు జాతీయ గీతమును పఠించు ప్రతి సందర్భమున రవీంద్రుని సుందర గంభీర ఆకారము మన కనుల యెదట సాక్షాత్కరించి శాంతి సందేశము నిచ్చుచుండును.

శూరుల జన్మము, సురల జన్మము, ఏరుల జన్మము తెలుసుకొనుట కష్టమని భారత కవి సూక్తి. అదే విధముగా ఋషీశ్వరుల జన్మమే కాక మృత్యువు గూడ సాధారణులకు తెలుసుకొనుట కష్టమైన కార్యము. రవీంద్రుడు తన మరణమునకు కొన్ని దినములు ముందు మృత్యువును గూర్చిన ఒక రచన గావించెను. బహుశః అదియే ఆయన తుది రచన. తన యవసానమునకు కొద్ది రోజులు ముందు మృత్యువునుగూర్చి రచన గావించిన రవీంద్రుడు త్వరలో తనకు స్వర్గలోకమునుండి రానున్న ఆహ్వానమును ఊహించుకొనెనేమో! మహాత్ముల యూహాలు సత్యసామీప్యములు కదా!

గత శతాబ్దమున మనదేశములో వివిధ రంగాల యందు దిగ్గజముల వంటి మహనీయు లనేకులు జన్మించినారు. దేవతాగణమున త్రిమూర్తులవలె వీరిలో ముగ్గురు మహనీయులు ప్రకాశించుచున్నారు. త్రిమూర్తుల యందువలె యీ ముగ్గురి యందును ఒక యేకత్వము గోచరించుచున్నది. ఆయేకత్వమే భారతదేశ ఆత్మ; భారతీయ సంస్కృతిలోని ఉదాత్తత. అధునిక కాలము నందలి భారతీయుల ఆశయాలు, మనోరథాలు, వీరియందు సంపూర్ణముగా మూర్తీభవించి యున్నవి. ఈ ముగ్గురి చరిత్రయే, నవభారత, స్వతంత్ర భారత, చరిత్ర యని నిస్సందేహముగా చెప్పవచ్చును. ఈ ముగ్గురిలో ఒకరు కవి; ఒకరు ప్రవక్త; ఒకరు ధీరోధాత్తుడైన నాయకాగ్రేసరుడు. ఇందులో కవీంద్రుని కడమ యిద్దరు గురుదేవునిగా భావించినారు. ఆ కవీంద్రుడే రవీంద్రుడు; ఆ ప్రవక్త భారత జాతిపిత గాంధీ మహాత్ముడు; ఆ మహా నాయకమణి జవాహర్లాల్ నెహ్రూ.

గాంధీ మహాత్ముడు భారత రాజకీయ రంగమునకు ఏకైక నాయకత్వము వహించి, స్వాతంత్ర్యరథ సారథ్యమునకు పూనుకొనుటకుముందుగనే రవీంద్రుడు రచయితగా ప్రపంచ ప్రఖ్యాతి గాంచి, తరువాత గాంధీ మహాత్ముని రూపమున ఉప్పొంగ నున్న భారతజాతి అంతశ్శక్తికరణమును ప్రపంచమునకు పరిచయము గావించినట్లు ఆయన రచనలు ఋజువు చేయుచున్నవి. 1901 సంవత్సరమున శాంతినికేతన స్థాపన, 1913 సంవత్సరమున నోబుల్ బహుమతి, 1915 సంవత్సరమున విశ్వభారతి స్థాపన ఇందుకు ఉదాహరణములు.

రవీంద్రుడు జాతీయకవి; విశ్వకవి. భారతదేశానికి జాతీయ గీతమును ప్రసాదించిన గౌరవము రవీంద్రునికి దక్కినది. ఒక్క జాతీయ గీతమే కాదు.

ఆయన రచనల నన్నింటిని సమగ్రముగా పరిశీలించి నప్పుడు, అందు లో అడుగడుగున భారత దేశము, భారత సంస్కృతి ప్రతిబింబములు కనుపించ గలవు. సకల భారత రచయితలయందు ఇది రవీంద్రుని ప్రత్యేకత. రవీంద్రుడు వంగ వాఙ్మయ రంగమున అడుగు పెట్టుటకు ముందుగనే, వంగ సాహిత్యములో ఆధునికయుగ నిర్మాతలు కొందరు ఉద్భవించి యుండిరి. సుప్రసిద్ధ విద్వాంసుడైన ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు వంగ వాఙ్మయమున అనేక వచన రచనలు గావించి, తన సరళ రమ్యశైలిని వంగరచయిత లందరికిని ఒరవడి గావించి యుండెను. మైకేల్ మధుసూదనదత్తు భావగంభీరమైన కావ్యములను, మనోహరమైన శైలిలో రచించి, ఆధునిక పద్ధతులను వంగ సాహిత్య రంగమున ప్రవేశ పెట్టి యుండెను. మధుసూదనదత్తు వంగసాహిత్యమున ప్రవేశపెట్టిన విప్లవాత్మకమగు మార్పులు ఒక తీవ్ర సంచలనము కలుగజేసినవి. బంకించంద్ర ఛటర్జీ మనోహరమైన నవలలను వ్రాసి వంగ వాఙ్మయమున క్రొత్త మార్గమును చూపించి యుండెను. ఈ రచయితల వరుసలో సాహిత్య రంగమున ప్రవేశించిన రవీంద్రుడు, వీరి నందరిని తన ప్రతిభాసంపదచేత అతిక్రమించి, వంగదేశమున ఆబాలగోపాలము ఆదరణపొంది సకల భారతదేశమేకాదు సకల ప్రపంచము జోహారుల నందుకొని వంగ వాఙ్మయమున, భారతీయ సాహిత్యమున, అగ్రగణ్యుడై ప్రకాశించినాడు. రవీంద్రుని రచనా ప్రావీణ్యమును గూర్చి ప్రస్తావించుచు నవలగాని, చిన్న కథగాని, నారన్నబాగుగా వ్రాయ గలిగినవాడు ఒక్క రవిబాబు తప్ప మరెవ్వరును లేరని శరచ్చంద్ర ఛటర్జీ యొకమారు వ్రాసియున్నారు.

రవీంద్రుని రచనలలోని వైవిధ్యము ఇతరుల రచనల యందు కానరాదు. రవీంద్రుడు నవలలు వ్రాసినాడు, చిన్న కథలు వ్రాసినాడు, ఏకాంకికలు, నాటికలు వ్రాసినాడు. బాల వాఙ్మయమును రచించినాడు; ఉదాత్తమైన కవిత్వము అల్లినాడు, రమణీయమైన పాటలు పాడినాడు; కళాఖండములైన వ్యాసములను లిఖించినాడు. రవీంద్రుడు సాధించక విడిచిన వాఙ్మయ విశేషములేదు; పట్టిన దానినెల్లను బంగారము గావించక వదలి పెట్టలేదు. ఇటువంటి సర్వతోముఖ ప్రతిభా విశేషమును ప్రదర్శించిన భారతీయ రచయితలు మరెవ్వరు? రవీంద్రుని రచనలలో అది యేశరగతికి చెందిన రచన

యైనను భారత ఆత్మ అంతర్వాహినిగా ప్రవహించు చున్నది. ఇదియే రవీంద్రుని విశిష్టత.

భారతదేశ ఆత్మను, భారత సంస్కృతిని ప్రపంచమునకు వెల్లడి చేయుటకు ప్రయత్నించిన విజ్ఞానులు కొందరు ఆధునిక యుగమున కలరు. వివేకానందుడు భారతీయ వేదాంతమును తన అమోఘమైన ఉపన్యాసాల ద్వారా సకల ప్రపంచానికి పరిచయము గావించి యున్నాడు. రవీంద్రుని గౌరవాదరములకు అత్యధికముగా పాత్రుడైన అరవిందుడు ఈ మార్గమున కొంత కృషి గావించియున్నాడు. గీతా భాష్యాది ఉద్గ్రంథముల ద్వారా లోకమాన్యతిలక్ భారతీయ వేదాంతమును ప్రతిపాదించు ప్రయత్నము గావించి యున్నాడు. భారత సంస్కృతి తన జీవితములో ప్రతిపదమునందు ప్రతిబింబింప జేసికొనిన మహాత్ముడు గాంధీజి. కాని మన మతము, మన వేదాంతము, మన సంస్కృతిలోని విశ్వజనీనమైన విలువలు, శాశ్వత ప్రయోజనాలు సమస్త ప్రపంచమునకు మనోరంజకముగా వివరించుటలో రవీంద్రునిదే అగ్రస్థానము. ఇందుకు కారణము రవీంద్రుడు కవి యగుటయే; రవీంద్రుని రచనలు రసాత్మకములగుటయే; రవీంద్ర వాఙ్మయము కాంతాసమ్మితమగుటయే. భారతీయ జీవిత విమర్శనమునకు ఆటపట్టులై, భారతీయ సంస్కృతి ప్రతి పాదకములైన రవీంద్రుని రచనలు ప్రపంచ సాహిత్యమునకు శిరోభూషణములు; ఉపనిషత్తులతో పోలగల రవీంద్రుని రచనలు మానవజాతికి మహోన్నతమైన సందేశము నిచ్చినవి.

ఋషికాని వాడు కవి కాజాలడని ఆర్యోక్తి. కవీశ్వరుడైన రవీంద్రుడు ఋషీశ్వరుడని ఆయన జీవితము నిరూపించు చున్నది. ప్రకృతిలో భగవంతుని అంశమును సందర్శించిన ప్రాచీన భారత మునీంద్రులవలె ఆశ్రమవాసము కల్పించుకొని ప్రకృతికి సన్నిహితుడుగా తన జీవనము గడపినాడు; ప్రకృతికి కవితా స్వరూపము నిచ్చినాడు. శీతల తరుచ్ఛాయలయందు, పచ్చిక పట్టుల మీద, ప్రకృతి దృశ్యములమధ్య, సంగీత సాహిత్య చిత్ర లేఖనాది కళల ద్వారా, రవీంద్రుడు ఆనందోపాసన గావించినాడు. ప్రకృతిమాత చల్లని యొడిలో ఉపలాలితుడైన ఆయన ప్రపంచానికి ప్రేమ సందేశము నిచ్చినాడు. ఆనాటి వ్యాస వాల్మీకుల రచనలవలె రవీంద్రుని రచనలుగూడ భారతజాతి ఆత్మకు ప్రతిబింబములు, భారత సంస్కృతికి భాష్యములు; భారతదేశ

ఆధ్యాత్మిక సంపదకు ఆలవాలములు. వానిలో ప్రతి పదమున, భారతీయ హృదయము స్పందించుచున్నదని చెప్పినచో అతిశయోక్తి కాజాలదు.

మహాకవి రవీంద్రుడు మహాభక్తుడు కూడ. మన ఉపనిషత్తులను, మన వేదాంతమును సంపూర్ణముగా అవగాహన చేసికొని, అందువలన కలిగిన దివ్య అనుభూతితో ఆయన కవిత్వము చెప్పినాడు. గీతాంజలి ఈ విధముగా చెప్పినదే. ఆత్మ అంతరాత్మకు నివేదించుకొనిన గేయ సందోహము గీతాంజలి. ఉపనిషత్తులు, భగవద్గీత మొదలైన వేదాంత గ్రంథాలలోని భావసుధారసము కడుపార గ్రోలిన రవీంద్రనాథుడు, ఆ రస పానము తతచే కలిగిన భావనా బలమున సౌందర్యసృష్టి గావించి యున్నాడని వేదాంతవేత్తల అభిప్రాయమై యున్నది. గాంధీజీవలె భగవంతునియందు పరిపూర్ణవిశ్వాసముగల ఆస్తికుడు రవీంద్రుడు.

భారత సంప్రదాయమునకు ఆటపట్టైన రవీంద్ర వాఙ్మయము, మన దేశములో మధ్యకాలము నుండి వ్యాపించిన సామాజిక దోషములను, కుల తత్వాలను, అస్పృశ్యతను గాంధీజీ తన హరిజనోద్యమమును ప్రారంభించుటకు చాలముందుగానే సంఘ దురాచారములుగా చిత్రించి, పరిహరించ వలసినదని చెప్పినది. ప్రాతది యెల్లను మంచిదను భావము రవీంద్రునకులేదు. శాశ్వతమైన ఆధ్యాత్మిక విలువలకు, నైతిక విలువలకు మాత్రమే రవీంద్రుడు ప్రాధాన్యము నిచ్చినాడు. కాలము మార్పును రవీంద్రుని వాణి గమనించినది. చిరకాల దాస్యముచే, సర్వవిధముల అధఃపతితులైన భారతీయులకు, నూతన ఆశలను, ఉదాత్త ఆశయాలను, ఆత్మవిశ్వాసమును కలుగజేసినది రవీంద్ర వాఙ్మయము. విశ్వశాంతి, వసుధైక ప్రభుత్వమును ఆదర్శాలను ప్రపంచమునకు ఉపదేశించినది రవీంద్రుని లేఖిని. భారతీయుల కష్టసుఖములను, మంచి చెడ్డలను, ఉత్సాహోద్రేకాలను, ఆవేదనానందములను, చిత్రించి భారతీయ హృదయమును మనోరథములను ప్రపంచమునకు ప్రకటించినాడు రవీంద్రుడు. ఆనాడు రవీంద్రుడు భారతదేశముగా రూపొంది, సకల ప్రపంచముతో సంభాషించినాడని చెప్పవచ్చును.

రవీంద్రునికి భరత జనయిత్రి ఆరాధ్యదేవత. సోదర భారతీయులను మాతృదేశ సేవకు పురికొల్పినది రవీంద్రుని కవిత్వము విజాతీయ సంస్కృతి,

విజాతీయ అభిరుచులు, అనుకరణలు రవీంద్రునికి ఇష్టము కావు. మాతృ భాషల ద్వారా విద్యాబోధన జరగవలెనని రవీంద్రుని ఆశయము. ఎంత పాండిత్యము గడించినప్పటికి, ఇంగ్లీషు భాషలో సాహిత్య నిర్మాణము గావించుట భారతీయులకు సాధ్యము కాదని రవీంద్రుని అభిప్రాయము. ఇంత మాత్రాన పాశ్చాత్య సంస్కృతిని ద్వేషించువాడు కాడు రవీంద్రుడు. ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతులలోని ఉత్తమ సంపద యంతయును సమ్మేళనమై విశ్వ సంస్కృతిగా రూపొందవలెనని రవీంద్రుని అభిప్రాయము. జగత్తునంతయును తన కుటుంబముగా భావించుకొనిన ఉదార చరితుడాయన.

భారతదేశము పరమత సహనమునకు ప్రఖ్యాతి వహించినది. అనేక సంస్కృతులను, అనేక సంప్రదాయాలను ఆకళించుకొని, అనేక మతములకు పుట్టినిల్లైన గౌరవము భారతదేశమునకు కలదు. ఇకముందుగూడ ఇందుకు అనుగుణముగా భారతదేశము అభివృద్ధి పొందవలెనని ఆయన ఆశయము. ఇంచుమించుగా జవాహర్లాల్ ఆశయము కూడ ఇదియే.

రవీంద్రుని ప్రతిభ సర్వతోముఖమైనది. రవీంద్రుని శక్తి సామర్థ్యాలలో ఎంతయో వైవిధ్యము కలదు. అయినప్పటికిని ఆయన నూటికి నూరుపాళ్లు కవి. ఆయన జీవితములో అడుగడుగునను కనుపించునది కవిత్వము. కవిగా ఆయన ఇచ్చిన సందేశము విశ్వజనీనమైనది. అణుబాంబుల మధ్య, కృత్రిమ ఉపగ్రహాల మధ్య యుద్ధ మేఘాల ఛాయలలో రవీంద్రుని వాణి జవాహర్లాల్ రూపమున మానవ జాతికి ప్రేమ సందేశము నిచ్చుచున్నది.

(గోలకొండ స్వాతంత్ర్య సంచికలో వ్రాసిన వ్యాసము)

# కవయిత్రి తోరూదత్

"ముదితల్ నేర్వగరాని విద్య కలదే ముద్దార నేర్పించినన్" అని చెప్పిన చిలకమర్తి కవి మాటలు అక్షరాలా సత్యమైనవి. ఏ రంగములో నైనను, సరియైన, సమానమైన అవకాశాలు లభించినచో పురుషులకు స్త్రీలు ఏమాత్రము తీసిపోరని ఋజువు చేయుటకు ఎన్ని నిదర్శనాలైనను చూపించ వచ్చును. గత శతాబ్దమున వంగ రాష్ట్రమున జన్మించి, కీర్తి గాంచిన తోరూదత్ అను యువ కవయిత్రి జీవితము ఇటువంటి నిదర్శనాలలో పేర్కొన దగినది.

తోరూదత్ 1856 వ సంవత్సరమున కలకత్తాలోని అగ్రవర్ణానికి చెందిన ఒక ఉన్నత కుటుంబమున జన్మించినది. చిన్నప్పటి నుండి సిరి సంపదలతో తుల తూగినది. అయితే ఈ ఐశ్వర్యము ఆమె జీవితమును ఆనందప్రదము గావించిన దని చెప్పుటకు వీలు లేదు. శైశవదశలోనే ఆమె సుకుమార హృదయానికి తీవ్ర ఆఘాతములు కొన్ని తగిలినవి. ఆమెకు పది సంవత్సరాలు నిండీ నిండని వయసులో ఆమె అన్న తన పదునాలుగవ యేట చనిపోవుట జరిగినది. ఆమెకు ఇంకను మైనారిటీ యైనను దాటని పదునెనిమిది సంవత్సరాల వయసులో ఆమె అక్క ఇరువదేండ్ల ప్రాయమున మరణించుట జరిగినది. ఈ రెండు మృతులు ఆమె లేత యెడద మీద సమ్మెట పోటులైనవి.

ఆమె తండ్రి ఉదార భావాలు కలిగిన సజ్జనుడు· మంచి విద్వాంసుడు; ఆయన తన కూతురును అల్లారు ముద్దుగా పెంచి ఆమె విద్యాభ్యాసానికి సకల సౌకర్యాలు కలుగజేసి, విదుషీమణిగా పెంచి పెద్దజేసినాడు. తండ్రిగారి సుందరమైన ఆరామములో ఆమె తన శైశవము నంతయును ఆట పాటలతో వెళ్ళబుచ్చినది. విద్యాబుద్ధులు నేర్చి, సాహితీ వ్యాసంగమున నిమగ్నయైన యౌవన దశలో ఆమె తన చిన్నప్పటి అనుభవాలను, బాల్య స్నేహితులను, ప్రకృతి దృశ్యాలను తలంచుకొని ఉత్తేజితయై వానిని తన కవితా సౌధమున సుందరముగా చిత్రించి అక్షరములను గావించినది.

ఆధునిక వాతావరణములో పుట్టి పెరిగి, పాశ్చాత్య సంస్కృతి పరిపూర్ణముగా ఆకళించుకొన్నప్పటికిని. తోరూదత్ రచనలను పరిశీలించినప్పుడు వానిలో ప్రతి పదమున భారత జాతీయతా ముద్ర స్పష్టముగా కనుపించుచుండును ధ్రువుడు, ప్రహ్లాదుడు, లక్ష్మణుడు, సీత, సావిత్రి మొదలైన పౌరాణిక వ్యక్తులను, వారి శీలమును అత్యంత అభిమానముతో ఆమె తన రచనల యందు చిత్రించినది. సాధారణముగా హిందూ కుటుంబాలలో చిన్నప్పుడు పసిపిల్లలకు ఇంటిలోని స్త్రీలు పౌరాణిక కథలను వీనుల విందుగా చెప్పుట జరుగును. బహుశః, చిన్ననాటి ఈ మధుర స్మృతులే తరువాత తోరూదత్ కవితా దర్పణమున ప్రతిఫలించినవేమో.

పదమూడు సంవత్సరాల బాలికగా నున్నప్పుడు, తండ్రి ఆమెను ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలను చదివించుట కొరకు అయిరోపా ఖండమునకు తీసికొని వెళ్లెను. ఆమె ఉన్నత విద్యాభ్యాస మంతయును పాశ్చాత్య దేశాలలోనే జరిగినది. ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలను ఆమె కూలంకషముగా పఠించినది. అందులోను ఇంగ్లీషుకన్న యెక్కువ వైదుష్యము ఆమె ఫ్రెంచి భాషలోనే సంపాదించినది. రచనా ప్రావీణ్యమున గూడ ఇంగ్లీషుకన్న యెక్కువ ప్రతిభ ఫ్రెంచిలో ఆమె ప్రకటించినదని సుప్రసిద్ధ విమర్శకుల అభిప్రాయము. నాలుగు సంవత్సరాలు విదేశాలలో విద్యాభ్యాసము గావించిన తరువాత ఆమె స్వదేశానికి, స్వరాష్ట్రానికి వచ్చినది. పాపము; తరువాత ఆమె జీవించినది నాలుగేండ్లు మాత్రమే ఇరువది మూడు సంవత్సరాలు నిండీ నిండని వయసులో ఆమె చిన్నప్పుడు తనను విడిచి వెళ్ళిన సోదరీ సోదరులను కలుసుకొనుట కొరకు పరలోకమున కేగినది. భగవంతుని సృష్టిలోని విచిత్రమేమో కానీ, ఆ ముగ్గురు సోదరీ సోదరులు, నిండు జవ్వనము గూడ దాటని వయసులో తమ కుటుంబమును, వృద్ధ జనకుని దుఃఖ సముద్రములో ముంచివేసినారు.

ఆమె తన జీవితపు చివరలోని నాలుగు సంవత్సరాలు కలకత్తా నగరములోని సుందరవనాంతరము నందలి సౌధములో గడపినది ఆమెది బక్కపలుచని సుకుమారమైన విగ్రహము. వయసుకు మించిన పాండిత్య భారముతో, నిరంతర సాహితీ వ్యాసంగపు బరువుతో, లేదీగ వంటి ఆ నాజూకు శరీరము క్రుంగిపోయినదేమో ! స్వదేశములో కొంత సంస్కృతము గూడ ఆమె అభ్యసించి

నది; సంస్కృత వాఙ్మయము నందలి ఉత్తమ కావ్యామృతమును తగినంత ఆమె తన కడుపార గ్రోలినది.

మాతృభాషయైన వంగ భాషలో ఆమె యేమియును వ్రాసినట్లు కనపడదు; అందులో ఆమె నేర్పుకూడ యెక్కువ కాదేమో! ఇంచుమించుగా ఆమె రచనలన్నియును ఇంగ్లీషు ఫ్రెంచి భాషలలోనే జరిగినవి. ఆంగ్ల ఫ్రెంచి భాషల యందలి ప్రాచీనుల రచనలకన్న ఆధునికుల రచనలే ఆమె యెక్కువగా అభిమానించినదని ఆమె రచనలు చాటుచున్నవి.

రచనలను చాల గావించినప్పటికి, జీవిత కాలమున పుస్తక రూపముగా ఆమె ప్రకటించినది ఒక్కటిమాత్రమే. అదియే (Sheafs gleaned in French Fields) అను గ్రంథము. ఛందో వ్యాకరణాది దోషాలు కొన్ని ఉన్నప్పటికిని, భావనా శక్తి, సహజ ప్రతిభ ఇందులో ప్రముఖముగా కనుపించుచున్నవి. ఆమె మరణించిన తరువాత ఈ గ్రంథమును ఆమె వృద్ధ జనకుడు పునర్ముద్రణము చేయించెను. ఈ రచన ఫ్రెంచి సమాజమును చిత్రించుటకు ఉద్దేశించినది. కాని ఇందులో స్పష్టముగా కనుపించునది భారతీయ మనస్తత్వమేనని ఆంగ్ల సారస్వత విమర్శకుల అభిప్రాయము. ఈ రచనలోని వాతావరణమునందు పాత్రపోషణయందు ఫ్రెంచి తత్త్వమునకన్న భారతీయత యెక్కువగా కనుపడుటయె ఇందుకు కారణము.

Mile. D' Averes అనునది ఆమె మరొక రచన— ఇద్దరు సోదరులు ఒక సుందరాంగికై పోరాడి పరస్పరము హత్య గావించుకొనుట, ఈ రచనకు ఇతివృత్తము. సాహితీ దృష్టితో ఈ రచన విలువ కలది. ఆమె రచనలలో శాశ్వతమైన విలువ కలవి ఆమె ఆంగ్ల ఖండ కావ్యాలు. ఈ ఖండకావ్యాలలో కొన్ని ఆమె జీవిత కాలమునందే కలకత్తా రెవ్యూ, బెంగాల్ మ్యాగజీన్‌లలో ప్రకటితమై ఆమె మరణానంతరము పుస్తక రూపమునుగా ముద్రితమైనవి. ఇందులో ప్రహ్లాదుడు, సావిత్రి మొదలైన పౌరాణిక కథలు గలవు. ఈ రచనలు భావ గాంభీర్యానికి, భాషా సారళ్యానికి ఆటపట్టులు. కొన్ని సందర్భాలలో భాష యొక్క దౌర్బల్యాను, క్షమించి భావోద్వేగముతో పరుగెత్తలేని శబ్దజాలము ఆమె రచనలలో కనుపించుచుండును. భావము, భాష యీ రెండింటి దృష్ట్యాకూడ అత్యుదాత్తములైన కొన్ని రచనలుకూడ ఈమె

ఖండ కావ్యాలలో కలవు. **Our Casurina tree** అనునది ఎంతటి గొప్ప కవికైనను కీర్తిని సంపాదించి పెట్ట గలిగిన మనోహర ఖండ కావ్యము. భావి చరిత్రకారుడు ఆంగ్ల వాఙ్మయ చరిత్రను రచించునప్పుడు అందులో తోరూదత్ కొక పుటను ఈయక తప్పదని, సుప్రసిద్ధ కవయిత్రియైన సరోజినీదేవి ఆంగ్ల రచనలను ప్రపంచానికి పరిచయము గావించిన ఆంగ్లేయ సాహిత్య విమర్శకుడు ఈమె పుస్తకానికి వ్రాసిన ఉపోద్ఘాతములో ఉద్ఘాటించి యున్నాడు.

(రేడియో ప్రసంగము)

# గాంధీజి సారస్వత మూర్తి

నేడు మనం గాంధీ జయంతి ఉత్సవాలు జరుపుకుంటున్నాము. గాంధీగారు వెళ్ళిపోయి ఇప్పటికి 30 సంవత్సరాలు కావస్తున్నవి. అనగా 40 సంవత్సరాల వయస్సులోపుగా ఉన్న దేశీయులు గాంధీగారిని చూచి ఉండకపోవచ్చును. వారిలో చాలా మందికి ఆయన వ్యక్తిత్వం సరిగా అవగాహన కాకపోవచ్చును. గాంధీగారు మనదేశానికి స్వాతంత్ర్యం సాధించిన జాతిపిత అని మాత్రము అందరికి తెలుసును. కాని ఆయన వ్యక్తిత్వం అంత మాత్రానికే పరిమితంకాదు. గాంధీగారిది మహోన్నతమైన బహుముఖమైన వ్యక్తిత్వం. భారత జాతి సర్వతోముఖాభ్యుదయానికిని, సమస్త మానవజాతి కల్యాణానికిని కృషి చేసిన ఉత్తమ పురుషుడు మహాత్మాగాంధీ. లక్ష్యసిద్ధి ఎంత ప్రధానమైనదో సాధనశుద్ధి కూడా అంతే ప్రధానమైనదని ఆయన వక్కాణించినాడు– జీవితములో నైతిక విలువలను తాను పాటించి ఇతరు లందరిని పాటించవలెనని ప్రబోధించిన ఉదార చరిత్రుడు ఆయన. సత్యానికి, అహింసకు ప్రతినిధిగా నిలిచిన మహనీయ మూర్తి ఆయన. పీడిత ప్రజల సముద్ధరణకు ఆయన ప్రత్యేక ప్రాధాన్యం ఇచ్చినారు. ప్రతి నేత్రయుగం నుండి జారే ప్రతి బాష్పకణాన్ని తుడువడమే తన జీవిత ధ్యేయమని ఆయన ఉద్ఘాటించినాడు. భారతదేశానికి స్వాంతత్ర్యం సాధించి, భారత ప్రజల సముద్ధరణకు మార్గదర్శకుడైన ఆ ఉత్తమ పురుషుడు సమస్త మానవ జాతి సర్వతోముఖ వికాసాన్ని కోరి కృషి చేసిన విమల చరిత్రుడు; ప్రపంచమునంతా తన కుటుంబముగా భావించిన మహానుభావుడు.

గాంధీ మహాత్ముని సంస్మరించే ఈ వారంలో సారస్వత వేదిక మీద కవి సమ్మేళనాన్ని ఏర్పాటు చేయడంలో సందర్భశుద్ధి గోచరిస్తున్నది గాంధీ మహాత్ముని బహుముఖ వ్యక్తిత్వంలో రచనా వ్యాసంగం ముఖ్యమైనది. అందు చేతనే యీ సందర్భములో మనము ఆయన సారస్వతమూర్తిని సందర్శించడం సముచితం కాగలదు. గాంధీజీ తల్లిదండ్రులు పవిత్రమూర్తులు. తల్లిగారు కఠోర వ్రతాలను, నియమాలను పాటించిన సాధ్వీమణి. తండ్రిగారు అనేక శాస్త్ర చర్చలలో నిరంతరము పాల్గొన్న మనీషి. వారి ఇంటికి చిన్నప్పుడు

జైన, వైష్ణవ విద్వాంసులు చాలా మంది వచ్చేవారు. ఈ విధంగా చిన్ననాడే ఆయనపైన జైన, వైష్ణవ మతాల ప్రభావం పడింది. సత్య హరిశ్చంద్ర నాటకం ఆయన హృదయంపై చెరగని ముద్రవేసినది. శ్రవణుని పితృభక్తి బాలకుడగు ఆయనను ఆకర్షించినది. తరువాత విద్యార్థిగా గౌతమబుద్ధుని చరిత్రను చదివి సత్యము అహింసలు ప్రాతి పదికలైన ప్రగాఢ విశ్వాశాలను ఆయన ఏర్పరచుకొన్నాడు. అంతేకాదు క్రైస్తవ మత గ్రంథమయిన బైబిల్‌ను ఇంగ్లండులో విద్యార్థిగా ఉన్నప్పుడు శ్రద్ధగా పఠించినాడు. మొదటినుండి భగవద్గీత ఆయనకు అభిమాన గ్రంథము. ఫలాపేక్షలేని కర్మ అనే గీతాబోధన జీవితాంతం ఆయన పాటించినాడు. తులసిదాసు 'రామచరిత మానస్' ఆయన పదే పదే పఠించినాడు. రామనామాన్ని తారక మంత్రంగా భావించుకున్నాడు. టాల్‌స్టాయ్ రచనలు ఆయన్ను ప్రభావితుణ్ణి చేసినవి. ఆయన వ్రాసిన 'స్వర్గం నీలోనే ఉన్నది' అన్న పుస్తకము చదివి, తాను చెప్పినది తాను ఆచరించే వ్యక్తి, సత్యాన్ని అనుసరించడంలో ఎటువంటి త్యాగానికి కూడా వెనుదీయని వ్యక్తి టాల్‌స్టాయ్ అని గుర్తించినాడు. విద్యార్థి అయిన గాంధీ తరువాత రస్కిన్ వ్రాసిన "Unto the last" అను గ్రంథాన్ని చదివి 'సర్వోదయం' అనే పేరుతో దానిని గుజరాతి లోనికి అనువదించినాడు. ఈ విధంగా అన్ని మతాల సారాన్ని గ్రహించి, ఉత్తమ సాహిత్యాన్ని పఠించి, సర్వోదయ సిద్ధాంతాన్ని రూపొందించి, తన జీవితాన్ని ఆ విధంగా మలచుకొని ఆయన విశ్వమానవుడుగా రూపొందినాడు. ఆయన పాటించిన నియమాలకు, నిర్ణయించిన కార్యక్రమాలకు, బోధించిన ఆశయాలకు వెనుకనున్న సంక్షిప్త కథ ఇది.

ఆయన సారస్వత మూర్తిని తీర్చిదిద్దిన సంఘటనల కథ కూడ ఇదే.

మహాత్మాగాంధీగారి వ్యాసాంగాలలో రచన ముఖ్యమైనది. ఆయనకు మాతృభాష మీద మక్కువ ఎక్కువ. బనారస్ హిందూ విశ్వవిద్యాలయం ప్రారంభోత్సవ సందర్భంలో మాట్లాడుతూ "నా మాతృభాష కాని విదేశ భాషలో మాట్లాడడం నాకు సిగ్గుగా ఉన్నది" అని ఆయన చెప్పినాడు. తరువాత సర్వదా ఆయన మాతృభాష ప్రాధాన్యాన్ని ప్రకటిస్తుండేవాడు. గాంధీగారు గుజరాతీ భాషలో అనేక రచనలు చేసినారు. ఆ రచనలు సమగ్ర జాతీయ జీవనానికి, అంతర్జాతీయ జీవనానికి మార్గదర్శకాలు. గాంధీగారి రచనలు అనేక మార్గాలలో సాగినవి. 'Young India', 'హరిజన్', 'నవజీవన్'

మొదలగు పత్రికలకు సంపాదకుడుగా మానవ ప్రపంచానికి సంబంధించిన సమస్త విషయాలమీద తన అభిప్రాయాలను వెల్లడిచేసినాడు. ఆయన తన ఆత్మకథను ఒక గ్రంథంగా వ్రాసినాడు. సామాజిక, రాజకీయ, ఆర్థిక, తాత్విక విషయాలమీద ఆయన అనేక వ్యాసాలు వ్రాసినాడు. ఆయన రచనలు అనేక సంపుటాలుగా వెలువడినవి. ప్రపంచ మేధావులు అనేకులతో ఆయన జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలు చాలావరకు ప్రకటితమయినవి. ఈ విధంగా గాంధీ మహాత్ముడు సమస్త విషయాలమీద వ్రాసిన పుటలు వేనవేలు కలవు. ఈ రచనలన్నియు ఆయనకు ప్రపంచ మహా రచయితలలో ఉన్నత స్థానాన్ని కల్పిస్తున్నవి.

తాను రచయిత కావాలనే ఉద్దేశంతో గాంధీగారు వ్రాయలేదు. లోకానికి ఆయన అభిప్రాయాలను విప్పిచెప్పవలెనని ఆయన వ్రాసినాడు. సారస్వత విషయాలకు మాత్రమే ఆయన రచనలు పరిమితం కాలేదు. మానవ జాతికి సంబంధించిన అన్ని సమస్యలను గూర్చి ఆయన వ్రాసినాడు. ఆయన వ్రాతలన్నీ గొప్పరచనలు. ఆయన శైలి నిరాడంబరమై, శక్తివంతమైనది. గంభీరమైనది. ఎంతటి గొప్ప అభిప్రాయాన్నయినా కొద్దిమాటలలో హృదయానికి హత్తుకుని పోయేటట్లు ఆయన చెప్పగలిగే వాడు.

ఆయన ఉపయోగించే ఉపమానాలు కూడా విశిష్టమైనవిగా ఉండేవి. గోవు ఆయనకు పవిత్రమైనది. గోవును గూర్చి వ్రాస్తూ ఆయన "It is a Poem of Pity" అన్నారు. ఒక విదేశీయ వనిత భారతదేశాన్ని అపనిందలపాలు చేయడానికి ఉద్దేశించి ఒక గ్రంథం వ్రాయగా దానిపై ఆయన It is the drain inspectors' report" అని ఒక మాటలో వ్యాఖ్యానించినాడు. ఆయన ప్రజాహిత జీవనంలో ప్రవేశించిన తొలి రోజులలో బొంబాయిలో ముగ్గురు మహా వ్యక్తులుండేవారు. ఒకరు ఫిరోజ్ షా మెహతా, రెండవ వారు లోకమాన్య బాలగంగాధర్ తిలక్. మూడవ వారు గోపాలకృష్ణ గోఖలే. ఈ ముగ్గురిని ఆయన అభిమానించినప్పటికిని గోఖలే గారిని తన గురువుగా భావించుకున్నాడు. వీరి విశిష్ట వ్యక్తిత్వాలను వివరిస్తూ "ఫిరోజ్ షా మెహతా హిమాలయ పర్వతాల వంటివాడు. ఆ యెత్తును చేరుకోవడం సాధ్యంకాదు. లోకమాన్యుడు సముద్రం వంటివాడు. ఆ లోతును చేరడం కూడా సాధ్యం కాదు. గోఖలే చల్లగా ప్రవహించే నదివంటి వాడు. నది ఒడ్డున ఆడుకోవచ్చును గదా" అని రమ్యంగా చెప్పినాడు.

మహాకవి రవీంద్రునికి మహాత్మునిపట్ల విశేష గౌరవాభిమానాలుండేవి. రవీంద్రుడు ఆయనను "ఇతడు ఉపనిషత్తులలోని పూర్ణపురుషుడు" (**He is the Poorna Purusha of the Upanishaths**) అని సంభావింపగా గాంధీజి రవీంద్రుని గురుదేవుడని పేర్కొనేవాడు. కవయిత్రి సరోజినీదేవికి మహాత్ముని పైన అపరిమితమైన భక్తి. జవహర్‌లాల్ నెహ్రూ మహాత్ముని అడుగు జాడలలో పెంపొందినాడు. రవీంద్రునికి, మహాత్మునికి ఒకేసారి తీవ్ర అభిప్రాయ భేదాలు పొడసూపినవి. విదేశవస్తు బహిష్కారము చేయవలెనని గాంధీ మహాత్ముడు కోరగా రవీంద్రుడు దానిని వ్యతిరేకించినాడు. కవియైన రవీంద్రుడు తన వ్యతిరేకతను లేఖారూపంలో తెలిపినాడు ఆ లేఖ ఒక సాహిత్య శకలము. మహాత్ముడు దానికి సమాధానంగా మరొక లేఖ వ్రాసి రవీంద్రుని నిరుత్తరునిగా చేసినాడు. మహాత్ముని లేఖ భావ గాంభీర్యంలోనూ, భాషాపటిమలోనూ రవీంద్రుని లేఖకన్న ఉత్కృష్టమై ప్రపంచ లేఖా సాహిత్యములో మహోజ్జ్వలంగా ప్రకాశిస్తున్నది. సాహిత్యానికి నోబుల్ బహుమతి పొంది, మహాత్ముని జీవిత చరిత్రను వ్రాసిన ఫ్రెంచి రచయిత రోమారోలా ఈ ఘట్టాన్ని రసవంతగా చిత్రించి మహాత్ముని మహారచయితగా ప్రశంసించినాడు.

ఉత్తమశ్రేణికి చెందిన మహాత్ముని జీవితములో రసవంతమైన మహావాక్యాలకెన్నింటికో కావలసిన ఇతివృత్తాలు ఎన్నో ఉన్నవి. భారతదేశానికి స్వరాజ్య మీయవలెనని నిర్ణయించిన తరువాత దేశంలోని కొన్ని ప్రాంతాలలో సంఘర్షణలు, దోపిడీలు చెలరేగి రక్తము ప్రవహించినది. బెంగాలులో ఈ హింసాకాండ మరింత చెలరేగినది. అప్పుడు బెంగాలులోని నౌఖాలీ ప్రాంతములో రక్త ప్రవాహములమధ్య మహాత్ముడు పాదచారియై ఒకరిద్దరు అనుచరులతో పర్యటన చేసి శాంతిని స్థాపించినాడు. పంజాబులో 50 వేల సైనికులు చేయలేని పని నౌఖాలీలో మహాత్ముడు సాధించినాడు. "నా 50 వేల సైన్యానికన్నా మహాత్ముడు ఎక్కువ శక్తిమంతుడు" అని అప్పటి గవర్నరు జనరల్ లార్డ్ మౌంట్ బేటన్ ఉద్ఘాటించినాడు. కవీంద్రుడు రవీంద్రుడు, కవయిత్రి సరోజినీదేవి ఈ శాంతి యాత్రలో మహాత్ముని ప్రోత్సాహించి భక్త్యంజలి సమర్పించినారు. ప్రసిద్ధ విజ్ఞానవేత్త ఐన్‌స్టైన్ "ఇటువంటి మహనీయులొకరు ప్రపంచము మీద అడుగుపెట్టి మానవాళికి వెలుగుబాట చూపించినాడని భావితరాల వారు విశ్వసించడం కష్టసాధ్యము కాగలదు" అని వక్కా

ణించినాడు. ఈ విధంగా ఆయన జీవితములో కరుణాలవాలమైన ఘట్టాలు మన కవుల రచనలకు ఇతివృత్తము కాగలిగిన ఘట్టాలు ఎన్నో ఉన్నవి. మన కవులెంతమంది వీనిని స్వీకరించినారు ?

గాంధీజీ జీవితాన్ని ఆయన కృషిని గూర్చి దేశభాషలలో వాఙ్మయము పుష్కలంగా వచ్చినది. తెలుగులో కూడా ఆయనను గూర్చి అనేక గ్రంథాలు ప్రకటితమైనవి. బసవరాజు అప్పారావుగారు ఆయనను వర్ణిస్తూ "వెన్నపూసా మనసు కన్నతల్లి ప్రేమ, పండంటి మోముపై బ్రహ్మతేజస్సు" అని చెప్పిన మాటలు అందరికి తెలిసినవే. వేలూరి శివరామ శాస్త్రిగారు ఆయన ఆత్మకథను చక్కని వచనములో తెనిగించినారు. తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు ఆయన ఆత్మకథను మహాకావ్యంగా వ్రాసినారు. ఇంకనూ రచయితలు, కవులు ఆయనను కీర్తించినారు. స్థాలీపులాక న్యాయముగా మహాత్ముని సారస్వత మూర్తి చిత్రణ ఇది.

(3-10-77 నాడు గాంధీజయంతి సందర్భంలో అవనిగడ్డలో జరిగిన కవి సమ్మేళన అధ్యక్షోపన్యాసము).

# జార్జి బెర్నార్డ్ షా

ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన ఆంగ్ల రచయిత జార్జి బెర్నార్డ్ షా కొంత కాలము నుండి అస్వస్థతతోనుండి త్వరలోనే సంపూర్ణముగా ఆరోగ్యము పొంద గలడని ఆశించుచుండగా అకస్మాత్తుగా ఆయన మరణవార్త తెలిసినది. గండము గడచి బయటబడినచో తాను అమరుడను కాగలనని బెర్నార్డ్ షా కొన్ని దినాలకు ముందే తెలిపియుండెను. ఈ మాటల వలన ఆయనగూడ తన అవసాన మును శంకించినట్లే స్పష్టము కాగలదు.

షా ఐర్లండు దేశీయుడు. కాని ఆయన మరణము ఐర్లండు దేశమునే కాక సమస్త ప్రపంచమును గూడ దుఃఖ సముద్రములో ముంచినది.

ప్రపంచ మహా రచయితలలో బెర్నార్డ్ షాకు సమున్నత స్థానము కలదు, నాటక రచయితగా ఆయన జగత్ప్రసిద్ధి గాంచి షేక్స్పియర్ తో సమానమైన రచయితగా మెప్పొందినాడు. షా అనేక నాటకములను రచించెను. తన నాటకము లన్నింటిలో జోన్ ఆఫ్ ఆర్క్ ఉత్కృష్టమైనదని ఆయన అభి ప్రాయమై యుండెను. ఆయన యీ అభిప్రాయమును తెలుపుతు జోన్ ఆఫ్ ఆర్క్ తాను వ్రాయలేదనియు, జోన్ ఆఫ్ అర్క్ యే దానిని వ్రాసినదనియు తెలిపిరి. షా రచనలలో వ్యంగ్యము అధిక్షేపము సమృద్ధిగా కనబడుచుండును. ఎనిమిదవ ఎడ్వర్డు, తాను కోరిన స్త్రీని వివాహము చేసికొనుటకై స్వాతంత్ర్యము లేకపోయినందున రాజ్యపరి త్యాగము చేసినప్పుడు ఆ సంఘటనకు కారణభూతు డైన బాల్డ్విన్ ప్రధాని మొదలైన వారి శీలమును ఆయన ఒక నాటకములో చక్కగా చిత్రించి యుండెను.

షా నాటక రచయితయే కాదు, అనేక యితర విషయాలను గూర్చికూడ ఆయన విలువ గల గ్రంథములను వ్రాసి యున్నారు. అర్థశాస్త్ర రాజకీయ శాస్త్రములు షాకు అభిమానాస్పదమైన విషయములు. ఈ విషయములను గూర్చి ఆయన గ్రంథములను గూడ రచించినాడు. షా గొప్ప విజ్ఞాని, మేధావి, ఫిలాసిఫర్.

మన తెనుగు కవీశ్వరులలో ఒకడు ఎంత బాగుగా రచించి నప్పటికిని సమకాలీనులెన్నటికిని మెచ్చరని తన విచారమును ఆక్రోశమును ప్రకటించెను.

ప్రపంచములో, అందు ముఖ్యముగా ప్రాచ్య ఖండమున సమకాలికుల మెప్పు పొందుట మిక్కిలి కష్టమైన పని. అయితే, యీనాడు పరిస్థితులు కొంచెము మారినవి. ప్రతిభకు ప్రణమిల్లుట మనవారు మెల్ల మెల్లగా నేర్చుకొనుచున్నారు. సమకాలికుల ఆదరము పొందిన రచయితలు కూడ కనబడుచున్నారు. అయితే, బెర్నార్డ్ షా వలె సమస్త ప్రపంచములోని సమకాలికుల గౌరవాదరములు పొందిన రచయిత మరొక్కరు కానిపించరని చెప్పవచ్చును. తన జీవిత కాలములోనే ఆయన పూర్వ కవులతో సమానమైన గౌరవాదరములు పొంద గలిగెను.

షా మంచి వక్త, సంభాషణాచతురుడు, ఛలోక్తి నిపుణుడు. ఏ విషయము గూర్చి యైనను ప్రశ్నించినప్పుడు వెంటనే యే మాత్రము తడుము కొనక చమత్కారముగా సమాధానము చెప్పుటలో షా అద్వితీయుమైన నేర్పు గలిగియుండెను. ఈయన ఛలోక్తి ప్రపంచ ప్రఖ్యాతి పొందినది. ఈ విధముగా తన ఛలోక్తులచేత సమస్త జగత్తును ఆకర్షించిన ఆధునిక రచయిత మరొక్కరు లేరని చెప్పిన అతిశయోక్తి కాజాలదు. షా ఛలోక్తులన్నియు కలిపి ఒక పుస్తకము ప్రకటించినచో అది యొక మంచి రచనగా ఉండగలదు. షా ఛలోక్తులలో సమాధానములలో ఆయన ప్రత్యేక వ్యక్తిత్వము ప్రతిబింబితమగు చుండును. షా సుందరాకారుడు కాడు. ఒకసారి అయిరోపాలో సౌందర్యము నకు ప్రసిద్ధి చెందిన యొక విలాసిని షాను వివాహ మాడగోరి "నన్ను నీవు పెండ్లాడినచో మన సంతానమునకు నా సౌందర్యము నీ మేధా సంపద లభించ గల"దని వ్రాసినప్పుడు షా వెంటనే ఆమెకు "......మన సంతానమునకు నా సౌందర్యము నీ మేధస్సు లభించినచో చాల పశ్చాత్తాపపడవలసి యుండు"నని వ్రాసిన సమాధానము సుప్రసిద్ధమైనది.

షా శాకాహారి, సామ్యవాది. సామ్యవాదమును గూర్చి ఆయన యొక గ్రంథమునుగూడ రచించెను. పుస్తక సమీక్ష సాహిత్య విమర్శలలో ఆయన ప్రత్యేకమైన నేర్పుగలిగి యుండెను. 1925 సంవత్సరములో ఆయన సాహిత్య మునకు నోబుల్ బహుమానము పొందియుండెను. మరణించు వరకు ఆయన వయస్సు 94 సంవత్సరాలు.

షా తీవ్రమైన రాజకీయ అభిప్రాయములు కలిగియుండెను. నిర్భయ ముగా విమర్శించుటలో షాను మొదలు చెప్పి తరువాత ఇతరులను చెప్పవలెను.

యుద్ధమును గూర్చి అభిప్రాయము తెలుపుమని కోరగా "ఈ విషయమై నా అభిప్రాయములో పనియేమి? ఏది యెట్లున్నను నేను విధిగా పన్ను చెల్లించుచున్నాను కదా?" అని ఆయన తెలిపియుండెను. గాంధీ మహాత్ముని మరణము పట్ల సంతాపమును తెల్పుచు "ప్రపంచములో మిక్కిలి మంచివాడుగా నుండుటకూడ యెంత ఉపద్రవ కరమైనదో ఇందువలన వెల్లడి యగుచున్న"దని షా చేసిన వ్యాఖ్యానము ఆయన ప్రత్యేకతకు నిదర్శనము. ప్రపంచ రాజకీయ వేత్త లందరిలో నెహ్రూ, స్టాలిన్‌లమీద షాకు విశేష గౌరవాదరము లుండెను ఆనాటి అంతర్జాతీయ రాజకీయసంఘర్షణలో ప్రపంచముయొక్క ఆశలన్నియును వా రిద్దరిమీదనే ఆధారపడి యున్నవని ఆయన తెలిపియుండెను.

94 సంవత్సరాల వృద్ధ దశయందు షా అస్తమించెను. ఆరమగ్గిన పండు రాలిపోయినది. జీర్ణమైన శరీరమునుండి ఆత్మ యెగిరిపోయినది.

(1952)

# మౌలానా అబుల్ కలాం ఆజాద్

మౌలానా అబుల్ కలాం ఆజాద్‌ను తలచుకొన్నప్పుడు రాచఠీవి ఉట్టి పడు ఆ విగ్రహము, పాదుషాలను స్మరింపజేయు ఆ గంభీరమూర్తి మన మనో దర్పణములందు ప్రతిబింబించుచున్నవి. ఆ రాచఠీవి, ఆ గాంభీర్యము ఆయన బాహ్యస్వరూపమునకే కాక ఆంతరంగిక స్వరూపమునకును విలక్షణమైన ప్రత్యేకతలని చెప్పవచ్చును. శక్తిమంతమైన ఆయన లేఖనీ విన్యాసము నందు, వచోవిలాసము నందు ఈ రెండు గుణములు విశిష్టముగా కనుపించుచుండును. దూషణ భూషణములకు రాగద్వేషములకు అతీతముగా కర్తవ్య నిర్వహణము గావించిన ఉదార చరితుడు మౌలానా సాహెబ్

ప్రచండశాసనుడైన మౌలానా దయార్ద్ర హృదయుడు. ఒక్కొక్కసారి ఆయన మాటలు దారుణాఖండల శస్త్ర తుల్యములై నప్పటికిని, హృదయము మాత్రము నవ్యనవనీత సమానము. ఇస్లాం మత సంస్కృతులను గూర్చి మౌలానా సాహెబ్‌ది తుదిమాట. సకల ప్రపంచములోని అరబ్బీ, ఫార్సీ విద్వాంసులలో ఆయనది అగ్రస్థానము. పదునాలుగు సంవత్సరాల చిరుత ప్రాయముననే భారతదేశములో లభించగల అరబ్బీ వాఙ్మయమున పారంగతుడైన మౌలానా, ఈజిప్టు వెళ్ళి Al Azhar విశ్వవిద్యాలయమున విద్యాభ్యాసమును రెండు సంవత్సరాలలో ముగించిన కుశాగ్రబుద్ధి; తరువాత కొన్ని అయిరోపా భాషలను కూడ నేర్చుకొని విశ్వసంస్కృతిని సంపూర్ణముగా ఆకళించు కొనినాడు.

ఉర్దూ వాఙ్మయమున రచయితగా మౌలానా సాహెబ్‌కు మహోన్నత స్థానము కలదు. ఖురాన్‌కు ఆయన వ్రాసిన భాష్యము, తజ్కిరా అను గ్రంథ రూపమున ఆయన ప్రకటించిన రచనలు సర్వదా నిలిచి యుండగలవు. మౌలానా శైలి, ఆయన వ్యక్తిత్వమువలె ప్రత్యేకమైనది. కలకత్తా నుండి 'అల్ హిలాల్' వారపత్రికను ప్రకటించి ఖిలాఫత్ ఉద్యమానికి, భారత జాతీయోద్యమానికి, హిందూ ముస్లిం ఐక్యతకు పట్టుగొమ్మగా నిలిచిన మౌలానా, తరువాత భారత జాతీయ కాంగ్రెసుకు ముమ్మారు మూర్ధాభిషిక్తులై,

దేశస్వాతంత్ర్యోద్యమానికి విజయవంతముగా నాయికత్వము వహించినారు. జాన్‌గంథర్ మౌలానా సాహెబ్‌ను భారత జాతీయ కాంగ్రెస్ మేధానిధిగా వర్ణించినారు. మౌలానా సంపాదకీయాలు, తెలుగువారికి ముట్నూరి కృష్ణా రావుగారి సంపాదకీయాలను జ్ఞప్తికి తెచ్చుచుండును. క్రిప్సురాయబార తరుణమున ఇంగ్లండు మంత్రివర్గ ప్రతినిధులతో సంప్రదింపుల సందర్భమున మౌలానా ప్రదర్శించిన రాజనీతి కౌశలము నిరుపమానమైనది. అత్యంత కఠినమైన అగ్ని పరీక్షలలో అమోఘవిజయాలను సాధించిన నిష్కళంక జాతీయవాది మౌలానా సాహెబ్.

మౌలానాలోని రాచఠీవి, గాంభీర్యములు మోతీలాల్‌ను జ్ఞప్తికి దెచ్చు చుండును; త్యాగము ఔదార్యము చిత్తరంజనదాస్‌ను తలపింప జేయును; ప్రాచ్యవిజ్ఞానము; పారమార్థిక చింతనము లోకమాన్యుని స్మరింపజేయును; మేరుసమాన ధైర్యము, పట్టుదలతో కూడిన సాహసము సర్దార్ పటేల్‌ను స్మృతికి తెచ్చుచున్నవి. కేసరియను బిరుదము లజపత్ రాయ్ యందువలె, మౌలానా యందు కూడ సంపూర్ణముగా సార్థకము. జవాహర్లాల్ యందువలె మౌలానాలో సాహిత్య విజ్ఞానముల సరససమన్వయము గోచరించుచుండును. ఈ మహనీయులందరి వలె, మౌలానా గూడ జాతిపిత గాంధీమహాత్మునిచే ప్రభావితులైన శేముషి సింధువు, త్యాగమూర్తి.

ఆజన్మాంతము మౌలానా వ్యక్తిత్వము సందువలె, అవసాన సమయమున గూడ ఒక విలక్షణమైన ప్రత్యేకత గోచరించుచున్నది. గీతాశ్లోకములను పఠించుచు పరమపదించిన లోకమాన్యునివలె, వైద్యుల పరిచర్యలను ఔషధాలను నిషేధించి, "నన్ను అల్లాకు వదిలివేయుము"ని చెప్పుచు, పరమేశ్వర ధ్యానమున లగ్నమైన హృదయముతో మౌలానాసాహెబ్ పరలోకగతుడైనాడు. దైన్యములేని జీవనము గడిపినమౌలానా ఆయాసము లేని మరణమునే పొందినారని చెప్పవచ్చును. "బలము నీవనాకు, భక్తుండ నీ యెడ; ఆలుబిడ్డలేనియట్టివాడ; కావునన్ను అధిక, కారుణ్యమున; ఇమ్మనుజ్ఞ కమల దళ మనోజ్ఞన యన" యని యోగీశ్వరుడైన శ్రీకృష్ణమూర్తిని స్మరించి కనులు మూసికొనిన భీష్ముని నిర్యాణమును, మౌలానా అవసానము జ్ఞప్తికి తెచ్చుచున్నది.

(రేడియో ప్రసంగము — మౌలానాసాహెబ్ కీర్తిశేషులైనప్పుడు)

# లజపత్ రాయ్

భారతదేశ స్వాతంత్ర్యము నాలుగైదు తరాలకు చెందిన మహనీయులు, త్యాగమూర్తులు నేసిన అపార కృషి ఫలితము. ఒక్కమారు ఈ కృషిని సమీక్షించు కొన్నప్పుడు ఇందులో కొన్ని దశలను స్థూలముగా మనము నిర్ణయించ వచ్చును. ఈదశలలో ఒక్కొక్కదానికి ఒక్కొక్కరు నాయకత్వము వహించి నప్పటికిని, మేధాశక్తిలోను, త్యాగసంపదలోను ఆ నాయకునికి తీసిపోని నాయకమణులు ప్రతిదశలోను కనిపించుచున్నారు. ఈ నాయక శ్రేణిలో లాలాలజపత్ రాయ్ విశిష్ట వ్యక్తిత్వము కలిగిన మహనీయుడు.

కాంగ్రెస్ స్థాపన తరువాత మొదటి దశకు నాయకత్వము వహించిన త్యాగమూర్తి దాదాభాయి నౌరోజీ. మొదటిదశ నౌరోజీ యుగమైనచో, రెండవదశ లోకమాన్యుని యుగము; మూడవదశ గాంధీజీ యుగము; నాలుగవదశ జవాహర్లాల్ యుగము. కాంగ్రెస్ చరిత్రను మనము ఈ నాలుగు యుగాలుగా విభజించవచ్చును దాదాభాయి ప్రభృతులు గావించిన ప్రబోధము దేశములో మంచి జాతీయ వాతావరణము కలిగించినది; ఈ వాతావరణములో లోకమాన్యుడు "స్వరాజ్యము నా జన్మ హక్కు"ని ఉద్ఘాటించినాడు. లోకమాన్యుని పిలుపు నందుకొని, గాంధీజీ భారత జాతీయ కాంగ్రెస్‌కు స్పష్టమైన రూపురేఖలు దిద్ది, తదాశయములను అసందిగ్ధముగా ఉద్ఘాటింప జేసినాడు. గాంధీజీ మార్గదర్శకత్వమున సత్యాహింసల ద్వారా పూర్ణస్వరాజ్యము సాధింపవలెనని నిర్ణయించుకొనిన కాంగ్రెస్, జవాహర్లాల్ నేతృత్వమున, పార్లమెంటరీ ప్రజాస్వామికము, లోకశేయస్సునకు అనుగుణమైన విదేశాంగ సామ్యవాదము అను ఆశయాలను నిర్వచించి, వాని సాధన కొరకు కృషిచేయ వలెనని తీర్మానించినది. ఈ నాలుగు దశలలో రెండవదశయైన లోకమాన్యుని యుగానికి చెందిన పురుషసింహము పాంచాల కేసరి లాలాలజపత్ రాయ్.

లోకమాన్యుని యుగమున ఆసేతుహిమాచలమైన భారతదేశమున ముగ్గురి నామములు ప్రతిధ్వనించినవి. లాల్, బాల్, పాల్, అనునవియే ఈ మూడు నామములు. లాల్ అనగా లాలాలజపత్ రాయ్, బాల్ అనగా బాల

గంగాధరతిలక్, పాల్ అనగా బిపినచంద్రపాల్. త్రిమూర్తులవలె ఆనాడు భారతజాతీయ రంగమున, ఈ ముగ్గురు శోభిల్లిన సంఘటన ఈనాటికిని ఆ రోజులు చూచిన వృద్ధమూర్తులు మహోత్సాహముతో జ్ఞప్తి చేసికొను చుందురు.

లాలాజి పాంచాలకేసరి యని ప్రసిద్ధి గాంచినారు. ఈ బిరుదు సర్వ విధాల ఆయనకు సార్థకమైనది ఆయన ఆకారము, విజ్ఞానము, పరాక్రమము ఆయనకు నాటి నాయకమణులలో సింహమను పేరును సంపాదించినవి. లాలాజి తన రాజకీయాభిప్రాయాలను ఎన్నడు దాచుకొనలేదు; సింహమువలె యెలుగెత్తి తన అభిప్రాయాలను చాటుటకు ఆయన వెనుదీయ లేదు. సహజ ముగా ఆనాటి ఆంగ్ల ప్రభుత్వానికి కంటక ప్రాయమైనదిది. కావున, నిరంత రము గూఢచారుల బాధను ఆయన యెదుర్కొనవలసి వచ్చుచుండెను. ఈ బాధ సహింపరానిదిదా విజృంభించినప్పుడు, లాలాజి అమెరికాకు కొంతకాలము ప్రవా సము వెళ్ళుటగూడ జరిగినది. అమెరికాలో గూడ లాలాజి నిరంతము భారత స్వాతంత్ర్యమును గూర్చి కలలు గాంచుచు కృషి గావించినారు.

కాంగ్రెస్ చరిత్రను అవలోకించినప్పుడు, అధ్యక్ష పీఠము నలంకరించిన మహనీయులలో కొందరికి ఈ గౌరవము చాల తొందరగా లభించినదనియు, మరికొందరికి ఈ గౌరవము చాల ఆలస్యముగా లభించినదనియు వెల్లడి యగు చున్నది. సర్వవిధములైన అర్హతలను హక్కులు కలిగి యుండియు కొన్ని కారణాల వలన కాంగ్రెస్ అధ్యక్షపీఠము నలంకరింపజాలని నిదర్శనాలు గూడ మనకు గోచరించుచున్నవి. ఈ నిదర్శనాలలో లోకమాన్య బాలగంగాధర్ తిలక్ గారి పేరు ప్రత్యేకముగా చెప్పవలసి యున్నది. కాలు దీరిన కాంగ్రెస్ వాదియైనప్పటికిని, లాలాలజపత్ రాయ్‌కు కాంగ్రెస్ అధ్యక్షపదవి నలంకరించు గౌరవము 1920 వ సంవత్సరము వరకు లభించలేదు. అంతకు ముందు రెండు మూడు పర్యాయములు కాంగ్రెస్ అధ్యక్షపదవికి పాంచాల కేసరి పేరు ప్రతి పాదించబడినప్పటికిని, లోకమాన్యుడు ఇందుకొరకు కృషి గావించినప్పటికిని, లాలాజికి ఈ గౌరవము లభించలేదు. 1920 వ సంవత్సరమున లాలాజి ప్రథమ పర్యాయము జాతీయ కాంగ్రెస్ అధ్యక్షులుగా ఎన్నికయైనారు.

లాలాజి తమ రాజకీయ జీవిత ప్రారంభములో అతి వాదులుగా ప్రఖ్యాతి గాంచినప్పటికిని, చివర దశలో వీరి అభిప్రాయాలలో కొంత మార్పు గోచరించి

నది. చివర దశలో లాలాజీ శాసన సభలలో కాంగ్రెస్ వాదుల ప్రవేశానికి సుముఖులుగా నుండిరి. ఇది రాజకీయ వర్గాలలో అసంతృప్తికి కారణభూత మైనది; లాలాజీ నాయకత్వమునకు వ్యతిరేకముగా స్వరాష్ట్రమైన పంజాబులోనే, ఉడుకురక్తము గల యువకులు తిరుగుబాటు చేసినట్లు కాంగ్రెస్ చరిత్ర మనకు తెలుపుచున్నది. లాలాజీ తన రాజకీయ జీవితములో తీవ్రమైన వ్యతిరేకతను కూడ ఎదుర్కొన వలసి వచ్చినది. పాంచాల రాష్ట్రస్థాయిలోనే కాక, అఖిలభారత స్థాయిలో గూడ సింహము వలె విక్రమించిన లాలాలజపత్ రాయ్, స్వరాష్ట్రములో ప్రజల ప్రతి పక్షము యొక్క ప్రతిఘటనను రుచిజూచి నారు. లాలాజీ తన జీవితములో బలవంతులైన మిత్రులనేగాక, బలవంతులైన శత్రువులను కూడ కలిగియుండిరి. ప్రపంచములో శక్తిమంతులైనమహాపురుషుల జీవితాలన్నింటియందును ఈసత్యము గోచరించు చున్నది.

లాలాజీ గొప్ప విద్వాంసుడు. నిజానికి ఆనాటితరము రాజకీయ నాయకుల ప్రత్యేకత ఇది; అది అతిరథమహారథుల యుగము. శారీరకముగానే కాక, మానసికముగాను వామన మూర్తులైనవారి యుగము కాదది. లోకమాన్యుని వంటి విజ్ఞానమూర్తికి సర్వవిధాల యోగ్యుడైన అంతరంగమిత్రుడు లాలాలజపత్ రాయ్, సంస్కృతము, ఉర్దూ భాషలయందు లాలాలజపత్ రాయ్ కూలంకష మైన పాండిత్యము కలిగియుండిరి. రుచులయందు, అభిరుచులయందు లాలాలజపత్ రాయ్‌కు లోకమాన్యునికి మధ్య పోలికలు కనిపించుచున్నవి. ఉభయులు ప్రాచ్యవిజ్ఞానమునందు, సంస్కృత భాషయందును అపారమైన ఆసక్తితో పాటు గాఢమైన ప్రవేశము కలిగియుండిరి.

ఆనాటి కాంగ్రెస్ నాయకులనేకుల వలె లాలాలజపత్ రాయ్ మంచి వక్తయై యుండిరి. నిద్రాణమైన జాతిని మేలు కొలుపుటకు, స్వాతంత్ర్య ప్రబోధముగావించి, చైతన్యము కలుగచేయుటకు, వక్తృత్వశక్తి రచనా శక్తి అత్యంత ఉపయుక్తమైన సాధనములు లాలాలజపత్ రాయ్ ఈ రెండు సాధనములను మిక్కిలి ప్రావీణ్యముతో ఉపయోగించిరి. ఉర్దూ భాషలో లజపత్ రాయ్ ఉత్కృష్టమైన వక్తగా ప్రఖ్యాతి గాంచిరి.

ఉర్దూ సంస్కృతాలతో పాటు లాలాలజపత్ రాయ్ ఆంగ్ల భాషయందు చక్కని వైదుష్యము సంపాదించియుండిరి. ఆంగ్ల భాషలో వారు కొన్ని

